రచింపజేసిన ప్రశస్తములవలె ప్రకాశమానంబు

మూ॥ నవతులసీదామకిసలయోత్కల్ప

క్రొత్తలగు ల్యాతతులసీదళముల పేరులయొక్క ఒప్పి దంబు,

మూ॥ నిరంతర పరిమళమిళిత

ఎల్లప్పుడును వాసనతో గూడికొనిన

మూ॥ నవ్యకాల్యమాలాలోల కల్లోల

నూతనమగు పుష్పములయొక్క సరంబులు తరంగ ములవలె చలించునదియు,

మూ॥ బంధురసుగంధ గంధానుబంధ

రమ్యమైనమంచి పరిమళముగల గంధమును ఎడతెగక ననువర్తించుచు

మూ॥ మందగంధవహాహూయమాన

మందగమనమైన వాయువుచేత పిలువబడిన

మూ॥ పుష్పంధయ ఝంకారధ్వని విరాజిత

తుమ్మెదలయొక్క ఝుంకారశబ్దముచేత మెరయబడిన

మూ॥ వైజయంతీ వనమాలికాలంకృత

గెలుపుగలవారిదై వైజయంతియను పేరొందిన అర ణ్యపుష్పఫల పల్లవములచేత రచించిన దామముయొక్క అ లంకారంబు,

మూ॥ నిజప్రిభాప్రకర

స్వకీయమగు కాంతిసమూహములు,

మూ॥ పర్యస్తోదస్త

అస్తమానా త్పూర్వా=పరకాలమునుండెడి,

మూ॥ ప్రభాకర గభస్తి విస్తారభాస్వర

సూర్యునియొక్క కిరణములవలె విశాలములై అంతట ప్రకాశించుచు

మూ॥ మహామూల్యకౌస్తుభ నూత్నరత్నప్రదీప్త,

వెలలేనిదై సముద్రమునందుబుట్టి కౌస్తుభమని పేరొందిన నూతనమగు మణియొక్క మిగులకాంతియు,

మూ॥ శ్రీవత్స లక్షణలక్షిత,

శ్రీవత్సమను పుట్టుమచ్చయొక్క చిహ్నముచేత ఒప్పిదంబు శ్రీవత్సమను దక్షిణావర్తమైన కేశములసుడియొక్క లాంఛనమని కొందరందురు

మూ॥ నందసుందరీనందన

ద్రోణుండను వసువునందుడుగా జన్మించె నతనిభార్యయగు ధరయను నామె యశోదాదేవిగా జన్మించె వారికి పరిపూర్ణతమావతారుడై కుమారుడుగ ప్రవర్తించిన శ్రీకృష్ణమూర్తియగు విష్ణువియొక్క

మూ॥ చరణారవంద మిళిందేం.

పాదములను కమలములకు భృంగముగ నొప్పుచు,

మూ॥ దు - ధరారవిందనందనాది వందిత

బ్రహ్మరుద్రేంద్రాదులు మొదలైనవారిచేత నమస్కరింపబడుచుండెడి

మూ॥ ఇందిరాసుందరీమణి మందిర

సుందరమైనలక్ష్మీదేవియొక్క రత్నగృహంబు,

మూ॥ మృగమదాగరు కర్పూర కుంకుమాది సురభి చందన దిగ్ధఘుసృణయుత

కస్తూరికృష్ణాగరు కర్పూర కేసరీ మొదలైన మంచిపరిమళముగల గంధమును బూయుటవలన గలిగినమిక్కిలి పరిమళంబు,

మూ॥ రాధారమా లింగితానుకూల,

గోలోకవాసినియగు రాధాదేవియొక్కయు, వైకుంఠవాసినియగు లక్ష్మీదేవియొక్కయు ఆలింగనము చేసికొనుటకు అస్పదమగుచు,

మూ॥ పీవరవిశాల వక్షస్థలం

బలిసినదగు వెడల్పయిన హృదయప్రదేశంబు.

మూ॥ గారుత్మతరచిత వద్వర్తులమితవిస్తృతవిరాజము రోజం.

మరకతమణులచేత నిర్మింపబడినదానిఁబోలి గుండ్రముగ తగుమై వ్యాపించి ప్రకాశించు చనులును (కపిలదేవహూతిసంవాదం) భాగవతం.

మూ॥ కపోతతరుణీతారుహ్యా

మంచియవ్వనముగల పెంటిపావురముయొక్క కంఠమునకు సమానంబు అనగా చలించుచుండునదియనుట

మూ॥ మణిరత్నసార వినిర్మిత

శ్రేష్ఠములగు రత్నమణులచేత రచింపబడిన.

మూ॥ బహువిధగ్రైవేయక భూషిత

అనేకవిధములైన కంఠభూషణములచేత అలంకరింప

బడినదియు

మూ॥ సుఖకేళీ సమారంభ సంరంభ

మన్మథక్రీడకు మిక్కిలి ఉపక్రమంబు జేసి త్వరపడుచు

మూ॥ పరిరంభణాం=భోధిరాట్కన్యగా

ఆలింగనము చేయుటవలన సముద్రరాజమగు క్షీర సముద్రినకు పుత్రికయైన రమాదేవియొక్క,

మూ॥ కరాంభోజకీలిత

కరకమలములయందు తొడుగబడిన,

మూ॥ స్వర్ణమణికంకణ

కాంచనరత్న కడియములు

మూ॥ నికషణస్ఫురణ

రాచుకొనుటవలన ప్రకాశించు

మూ॥ రేఖాత్రియ శోభనాత్రశోభన కమ్రకంబు కంధరా

మూడు రేఖలుయొక్క చక్కదనముచేత మిక్కిలి శ్రేష్ఠముగనుండు సుందరమగు శంఖమువంటి కంఠంబు,

మూ॥ అక్షీణబాణ తూణీరా=లంబిత

శాశ్వతములైన శరములునించియుండెడి అమ్ములపొదిమిగులవ్రేలాడుచు,

మూ॥ జగద్విరహా నిక్షేపకటిం

ప్రపంచమును మోహింపజేయు రమ్యముగనుండు పింకలును,

మూ॥ హారాంగద ప్రభాన్వైభవాభిరామ

ముక్తికాహారములచేత యుక్తమైన కేయూరములు

(అనగా బాహువులు) కాంతియొక్క ఉత్సవము మనోహరమైనవై

మూ॥ మృగరాజ సన్నిభోన్నతోన్నత

సిహ్మాపుమూపునకు సమానమగు మిక్కిలిపొడవైన

మూ॥ బంధురస్కంధం

పూర్ణములగు భుజంబులు,

మూ॥ శేషఫణిఫణా = భోగ. పృష్ఠ. వరిష్ఠాను = నుష్ఠాన. శ్రేష్ఠతర పృష్ఠం.

ఆదిశేషుని పరిపూర్ణమగు పడగయొక్క వీపున కధికమై గురుతరమగు ధ్యానాచరణమునకు కొనియాడదగిన వీపును.

మూ॥ సురేంద్ర శాఖిశాఖా మనోహర

దేవేంద్రుని కల్పవృక్షముయొక్క కొమ్మలవలె సుందరంబు,

మూ॥ సమదదిగ్వేదండ శుండాదండ మండిత.

మదించిన దిగ్గజములయొక్క తొండములవలె అలంకరింపబడినవియు.

మూ॥ హరిన్మణి స్తంభ గంభీర.

పచ్చలయొక్క కంబముల చందమున గాంభీర్యంబు అనగా క్షోభలేనివి.

మూ॥ మమహితానర్ఘ్యమణి కంకణాది.

మిక్కిలి శ్రేష్ఠములైన వెలలేని రత్నకడియములు మొదలగు.

మూ॥ భూషణ సుషమో = జ్వల.

ఆభరణములయొక్క యెక్కువ కాంతితో గల శృంగా రంబు.

మూ॥ శాతవ భయంకర దుష్టనాశంకర తాపసవం శంకర

శతృవులకు రౌద్రమును దుర్జనులకు మరణమును. సాత్వికులకు యోగీశ్వరులకు వశీకరము.

మూ॥ త్రిభువన శుభం కరకరేణ,

మూడులోకములకు శుభమును చేయునవియైన బాహువులయందు

మూ॥ కనక సహస్రపత్ర సంకలిత.

వేయుసువర్ణ పత్రములతో కూడికొని

మూ॥ తేజః పుంజసంజాత

కాంతి ప్రభావముయొక్క సమూహములవల్ల చక్కగా బుట్టిన శ్రీలీలాకమలంబును.

మూ॥ లీలాకంజాతం

క్రీడాకమలంబునం

మూ॥ రాకామృగాంక

అఖండ పూర్ణమా చంద్రునికి.

మూ॥ సదృశచారుతరా = ననా = వలోకన మణీసు కరముకురం

సమానమైన సుందర తరమగు ముఖమును జూచుట కొప్పుచుండెడగు మణిమయమగు = దంబు.

మూ॥ సవిరళ సరాళ.

ఎడతెగనిదై పరహృదయ మనుసరించి వినువారి కింపుపుట్టించునదియగు

మూ॥ మురళీ వివరేషు

పిల్లంగ్రోవియొక్క రంధ్రములయందు,

మూ॥ గ్రామ.

గానమునందలి ఆరోహణా = వరోహణములు గలుగునట్లు.

మూ॥ షడ్జఋషభగాంధార పంచమ మధ్యమధైవత నిషాదస్వర.

" శ్లో॥ అయుతానిచ షట్త్రింశత్సహ స్రాణిశతాని చస్వరాణాం అని అద్భుత రామాయణమున ఉమామహేశ్వర సంవాదము.

మూ॥ జాతికళా మూర్ఛన.

సంగీత సర్వార్థసార సంగ్రహమును. గానశాస్త్రము చూడుడు,

మూ॥ మోహన బ్రహ్మ గాంధర్వగీత విద్యానురో గావితృప్తేపి.

మై మరచునట్లు జేయు సామగాన సంబంధమైన గంధర్వ సంగీతంబగు గానవిద్యాను బంధమునందు తృప్తిజెందక బాడుచుండెడి.

మూ॥ సప్తరంధ్ర క్లుప్తపర్వ.

యేడు బలములచేతని యామకములైన గనుపులుకలిగి

మూ॥ కింహ నాది శీనామక.

అద్భుతముగ ధ్వనించుచున్న దగుటవలన మహానాదినియను పేరొందిన.

మూ॥ రణితమణి వేణుదండం.

మ్రోయుచున్న రత్నములుగల పిల్లంగ్రోవియును.

మూ॥ అమానుష విశేష. భీషణాఘోషేణ.

దేవసంబంధమగు అధికమైన భయంకరముగల ధ్వని వలన.

మూ॥ సరసిజాండకరండ.

బ్రహ్మాండమను బరిణెలోని.

మూ॥ పరవీర మండల హృత్కుండికా.

శూరులగు శత్రుసమూహముల గుండియలయు.

మూ॥ తదాంగనాదుర్భరగర్భ.

వారి భార్యలయొక్క భరింప శక్యముగాని, చూలులయు. (అనగా పిండములు.)

మూ॥ గర్భస్థా = ర్భకనిర్భేదన.

వారి ఉదరములందుండు శిశువులం భేదింపజేయు.

మూ॥ శారదనీరద పారద పటీర హీర నీహార ఘనసార

శరద్రాత్రి నీటిమేఘము పాదరసము చందనము వజ్రము మంచుబంతు పచ్చకర్పూరము యొక్క కాంతికి

మూ॥ సద్వృత్త శుభలక్ష

సమానమై మంగళకరమగు చిహ్నములచేత

మూ॥ దక్షిణావర్త సుబద్ధ

దక్షిణావు సుడి తిరిగి పూజ్యమై బుట్టినదియు

మూ॥ పాంచజన్యాఖ్య శంఖం

సాందీప నందుని భ్రమింగిన పంచజనుడను దానవు గర్భజ జనితమగుటచేత పాంచజన్యమని పేరొందిన శంఖమును,

మూ॥ సహస్రకర సహస్రకిరణ.

సూర్యునియొక్క వేయు మరీచులకంటె అధికము..

మూ॥ దుస్సహ ప్రభాపటల.

సహింప శక్యముగాని కాంతియొక్క సమూహములచేత.

మూ॥ మనల్ప కల్పాంతకాల.

సంపూర్ణ ప్రళయకాలమునాటి అగ్నికంటె.

మూ॥ కాలానల తీక్ష్ణ సంభ్రమభ్రమణ,

వేడిమి గలిగి శత్రుసైన్య దళనాదులవల్ల బుట్టిన హర్షమున తిరుగుచు.

మూ॥ యవక్రపరాక్రమ విక్రమచక్ర మాహాత్మ్యత్రవ వాత్రి,

వంకర లేనిదై పరుల నాక్రమించుటకు మిక్కిలి బలిమిచేత సాంగముగా వెడలి.

మూ॥ భేతాళ పిశాచ కూశ్మాండ శాకినీ ఢాకినీ నై నాయక,

సంస్కార హీనులైనవారు పిశాచులు దహనము చేయక పూడ్చబడువారు కూశ్మాండులు అమంత్రకముగ

హననము చేయువారు బాలగ్రహములు మహాదానములు పట్టువారు బ్రహ్మరాక్షసులు కడుపులో బిడ్డ చచ్చుటచేత మృతులైనవారు శాకినులు కడుపు దిగబడుటచే చచ్చిన వారు ఢాకినులు [శుకసప్తతి.]

మూ॥ విప్రగ్రహాది దుర్గ్రహా,

బ్రహ్మరక్షస్సులు మొదలగు దుష్టగ్రహములను శత్రు సమూహములను,

మూ॥ నిగ్రహే = గ్రసనోదగ్రోగ్ర,

నాశనము సేయుటకు మున్ముందుగ బోవు అధికమైన భయంకరమగు.

మూ॥ విగ్రహాయ మానసహస్రసుదర్శన నామ్నా
యచక్రం,

శరీరంబునుబోలి వేయుధారలుగల (భక్తులచేత సుఖముగా చూడబడుచున్న దగుటచేత) సుదర్శనమను పేరొందిన చక్రాయుధంబును.

మూ॥ అనవరత విరోధి వరూధినీ రుధిర కర్దమలిప్త
దీప్తాంగ,

నిరంతర మందుచు శత్రుసైన్యములయొక్క రక్తపు బురదచేత పూయబడి సంధ్యవలన గలుగు వెలుగుచేత అవయవములు కలదగుచు.

మూ॥ మాఖండలారి తండోపతండ,

దేవేంద్రాదులగు రాక్షసుల గుంపుల గుంపులను.

మూ॥ దండివాడ ప్రచండ,

యమునియొక్క దండాయుధ విధంబున వేండ్రి
ముచేత.

మూ॥ భండన చండగతి ఖండి ఖండీకరణ,

యుద్ధములయందు మిక్కిలి కోపమువల్ల కమవడి గలి
గిచూర్ణచూర్ణముగా.

మూ॥ వివిధ వినోద కర్త్యా,

బహువిధములైన వేడుకలు జేయు.

మూ॥ కౌమోదకీ నామక గదాదండం,

దేవాయుధము గానబలుకునట్టి స్వభావము గలిగి
భూమిని సంతోషింపజేయు కౌమోదకియను పేరుగల గదా
యుధంబును.

మూ॥ అహిత వాహినీవ్యూహ,

వైరులయొక్క సేనాసమూహంబులందు.

మూ॥ మఖండతాండవ పాండిత్యోచ్చండ ఖండిత,

సంపూర్ణమైన నాట్యముయొక్క విచక్షణమువలె
ఆగ్రహముచేత త్వరపడుచు త్రుంచిత్రుంచి.

మూ॥ ఖండఖండ చకార,

తునుతునుకలుగా జేయుచు,

మూ॥ బృందారక బృందానందకర,

దేవతా సమూహములకు సంతోషము కలుగజేయు
నదియగు.

మూ॥ నందక మహాసి శేఖరం,

నందకమను పేరై సుందరంబగు శ్రేష్ఠమైన ఖడ్గంబును

మూ॥ అన్యసాధనా = భేద్య,

ఇతరోపాయములవల్ల భేదించుటకశక్యంబై.

మూ॥ ప్రతిపక్ష శిక్షావిచక్షణ దక్షాధ్యక్ష,

విరోధులను సంహరించుటయందు సర్వశక్తి గలిగిన బలముచేత ఉత్కృష్టముగ వ్యాపించుచు.

మూ॥ చతుర చతుర్దశ ఘంటికాఘణాత్కార,

చాతుర్యమైన పదునాలుగు ఘంటలయొక్క యెడతెగని ధ్వనిగల.

[ రా మా య ణ ము. ]

మూ॥ సముల్లసిత శార్ఙాభిధాన,

మిక్కిలి ప్రొడు వైశార్ఙ్గమను పేరొందిన.

మూ॥ చండతరోద్దండమండిత కోదండం,

అధిక భయంకర తరమగు ప్రతాపమువల్ల ప్రకాశింపంబడిన కార్ముకంబును.

మూ॥ శత్రులోక సమాకుల నిబిడనీరంధ్ర నిష్ఠురాంధకారంబంధుర బంధనగుటలీకృత,

విరోధులగు జనులను మిక్కిలి కలతచేత సందులేక నిండుకొన్న కాఠిన్యమగు చీకటియందు క్రిందుమీద తెలియనట్లు బిగించి కట్టివేసిన విధంబున వంకరజేయు.

మూ॥ నిష్కళంక నిరాతంక సాంద్రచంద్రాకార మండల పరిమండిత,

కళంకరహితమగు అడ్డులేని దట్టమగు చంద్రబింబము

నకు సద్భూశమై లెస్సనలంకరింపబడి॥ శ్లో॥ చక్షూంషిశర్మ్యా
శతచంద్ర చాదయ అని నారాయణకవచనము.

మూ॥ సర్వాంగ లక్షణ.

సమస్త అవయవములయందు లాంఛనములు గలిగి.

మూ॥ ధమణ సిస్మిత నిర్మల భర్మ వర్మచమూణది.

యమునివల్ల రచింపబడిన పరిశుద్ధమగు సువర్ణము
యొక్క రాశినిచేత నుండుకెడెము మొదలైన.

మూ॥ నానావిధ సాధనా = యుధో = పరంజిత,

బహువిధములవల్ల చంపుట కనుకూలములగు ఆయు
ధములచేత మిక్కిలి ప్రకాసింప బడిన.

మూ॥ మాజాను బాహుద్వయ చతుష్కాష్టం,

మోకాళ్ళపరకు వ్యాపించిన రెండునాల్గెనిమిది బా
హువులును కృష్ణుండు ద్విభుజుడు శ్వేతద్వీపవాసి చతుర్భు
జుండు వైకుంఠవాసి నారాయణు డష్టభుజుండు పాశాంచదధా
నోష్ట గుణోష్టబాహుః అని నారాయణ కవచప్రయోగము.

మూ॥ తారతారకా = కారకరోరువాస్ఫుర,

ముత్యములయు నక్షత్రములయు సమానమైన బాహు
వుల వ్రేళ్ళయొక్క గోళ్ళుమర.

మూ॥ తృష్ణరాగాది మణిముద్రిత ముద్రికాలంకార

కెంపులు మొదలగు రత్నములు చెక్కబడిన ఉంగు
రముల శృంగారముచేత.

మూ॥ ప్రత్యగ్ర ప్రవాళకళా హేళన కరాంగుళిం,

క్రొత్రపగడపు కాంతిని తిరస్కరించు బాహువుల

వేశ్లిష్టము.

మూ॥ శ్రీ ఖడ్గశ్రీభీమరధ్యమైన నళినయ నాది సుస్థిరాంక

శంఖసుదర్శన వజ్రమత్స్య కమల గోష్పదాది మొదలి శాశ్వతమైన లాంఛనంబు గలదియు.

మూ॥ దాసజనశిరః ప్రధానకారణ,

జనులయొక్క మస్తకములకు ముఖ్యమైన హేతువైనదియు (స్వామికార్యములను స్వప్రధానముగా జూచువాడు దాసుడనబడును)

మూ॥ శరణాగత శుభయప్రద,

ఆశ్రితులై రాబడువారియొక్క భయనివారణంబుచేయునదియు

మూ॥ ప్రభాతారుణవిభాతి పాణిపంకేరుహాం

దినోదయ సమయమునందు అరుణకాంతిచే వెలిగెడి పద్మములవంటి అర చేతులు,

మూ॥ శ్రీభువాంభోజ చుంబన చిబుకం,

లక్ష్మీదేవియొక్క కరాబ్జములచేత లాలించు మండెడి గడ్డమును.

మూ॥ మురళీకృత పుణ్యనిధాన,

పిల్లంగ్రోవిచేసిన సుకృతముయొక్క మొదలగనియు.

మూ॥ లక్ష్మీవధూ సిక్షిప్త మధుయ సుధానిక్షేప,

రమాకాంత ఉంచబడిన శాశ్వతమైన అమృత మను ధనంబు.

మూ॥ పరిపక్వ బింబఫల ప్రవాళపల్లవారుణము

ధురాం = ధరం,

లెస్సగ పరిపక్వమైన దొండపండుయొక్కయు పగడ
ముయొక్కయు చిగురాకు యొక్కయు సంధ్యారాగముయొ
క్కయు కాంతికి సదృశమైన తియ్యనగు పెదవులును.

మూ॥ ఋగాదిగి మహావిభవాద సముద్ర మందమంద
స్మిత సదన,

ఋగ్యజుస్సామాథర్వణ వేదము లుద్భవించిన సాగ
రంబు. అల్పాల్పమైన చిరునగవుయొక్క మందిరంబు

మూ॥ ఘనసారాది సౌగంధ సౌరభా = మోదవదనం,

పచ్చకర్పూరము మొదలైన మంచివాసనయొక్క
పరిమళముయొక్క సంతోషము కలుగజేయు వదనమును.

మూ॥ శుక శారికా నికరచకచకితసుకలంక,

చిలుకలయు గోరవంకలయు గుంపులుగూడి కళంక
రహితమైన శ్రేష్ఠమగు చాకచక్యముతో.

మూ॥ మకరంద మధుసుధాధి కనవనవ నీతోపమాన

పూదేనెయొక్కయు తేనెయొక్కయు అమృతము
యొక్కయు యెక్కువయగు మధురమును గలిగి క్రొత్తవె
న్నకు సమానమైన

మూ॥ వచన రచనానిచయం,

మాటల కూర్పులయొక్క సమూహములును.

మూ॥ భక్తశోకశోకాం = బుధి సంశోషక,

సమస్త జీవంబులందు సమత్వ బుద్ధితో విష్ణునిభావిం
చునో వాడు. భక్తుండనబడును అట్టిభక్తులయొక్క దుఃఖ

మను వార్ధిని మిక్కిలి యుంకింపజేయు నదియును.

మూ॥ అపారోదార మాదర పాకావార,

అధికమైన దాతృత్వముచేత అక్కరవల్ల ప్రీతిజేయు సముద్రంబు.

మూ॥ సంపూర్ణ పూర్ణిమా చంద్రచంద్రికా శుభ్ర విభ్రాజిత,

అఖండమైన పున్నమనాటి చంద్రునియొక్క వెన్నెల వలె ధావళ్యమువల్ల తేజరింపబడిన.

మూ॥ దివ్య భవ్య మహనీయ మందహాసం.

అప్రాకృతమగు శుభముచేత మనోహరమైన అల్పపు గునవ్వును.

మూ॥ కుందదాడిమీబీజోపమ,

మల్లెమొగ్గలకు సమానమగు ఉన్నతములయు దాళిమ్మరి విత్తనములకు సదృశమైన పలుసలయు.

మూ॥ తాంబూల రాగరస వాసిత దంతపంక్తిం

క్రముకఖండ నాగవల్లీ కర్పూరశకల ముక్తాచూర్ణ ఏలా కస్తూరీ లవంగ జాత్యాదులు పరిచర్వణము జేయుట వలన గలిగిన అనురాగ రక్తద్రవము చేతను వాసనయుక్తమైన దదనపంక్తియును.

మూ॥ అగణ్య లావణ్య పుణ్యవరేణ్య,

సంఖ్యలేని సుందరముచేత ఒప్పెడిదిగా శ్రేష్ఠంబై.

మూ॥ విద్వేషి భీషణవిభాసిత.

విరోధులకు భయంకరముగ ప్రకాశింపబడిన.

మూ॥ కేవల శ్యామలో = ద్వేలశ్మశ్రుకేశం.

మిగుల నల్లనై మేరమీరియుండు మీసములును.

మూ॥ మధుమాస మధ్యందిన విద్యోతమానఖద్యోత
మండలచ్ఛ విచ్ఛటాచ్ఛ్రితిచ్ఛన్న.

చైత్రమాస మధ్యాహ్న సమయమందు ప్రకాశించు చుండెడి సూర్యబింబముయొక్క కాంతివల్ల గలిగిన కిరణము లకు సమానమై

మూ॥ శ్రవణకుండల మండితహీరమణిమరీచికానర్తన

చెవులయందు ప్రకాశించు పోగులయందుండు వజ్ర మణులయొక్క కిరణములు నాట్యముచేయు విధంబున చలించుచు,

మూ॥ రత్నేంద్రిదర్పణ దర్పవిదళన విఫలితకపోలం.

శ్రేష్ఠమగు రత్నపు అద్దముయొక్క కాంతిని తిరస్కరించుచుండెడి గొప్పవైన గండస్థలంబులును.

మూ॥ సలలిత శ్రీకారాక్షరసాధక సందేహాకృద్వర్ణ
నాహ్నాకర్ణం

మిక్కిలి కోమలమైన నశింపగూడని శ్రీకారమను నక్షరము జన్మించినందుకు సఫలంబయ్యెనని సంశయము గలుగజేయు స్తోత్రమున కర్హమైన చెవులును.

మూ॥ సమగ్రజగత్పరపాలన స్వవివాద సలోచన
యుగసీమాస్తంభసంభావిత.

సమస్తమైన లోకములను మిక్కిలి చక్కగా పాలించుటకు తామతామ చాలుదమని కలహించుచుండు రెండు

నేత్రములకు పౌలిమ్యా(ర)యొక్క యోగ్యమైన సూచములుగ నొప్పినదియు.

మూ॥ తిలచంపక ప్రసూనవిలాస దివ్యానఘ్రాణ మానవాసం.

నూపువ్వుయొక్కయు కనకసంపంగపుష్పంబుయొక్కయు శృంగారమువల్ల సుకుమారముచేత వెలుగుచున్న ఘ్రాణంబును,

మూ॥ శతపత్రపత్రోత్రప్రస్న.

కమల దళంబులందు జన్మించినందున విశాలములై

మూ॥ పుండరీకస్థిత,

తెల్లదామెరలందు వృద్ధి పొందినందున శుభ్రములై

మూ॥ ఇందీవర వినిందక

నీలోత్పలముల నిందించుటవలన మిగుల నల్లనై

మూ॥ విశిఖసంఖ్యవిఖ్యాత కర్ణాంతవిశ్రాంత

బాణంబులతోడ ప్రసిద్ధమగు స్నేహముచేయుట వలన వీనులవరకు యెడతెగక వ్యాపించినవై

మూ॥ కరుణామృతతరంగి తాపాంగేక్షణ చక్షుర్ద్వయం

కారుణ్యమను సుధారసముయొక్క అలలవల్ల కడకంటి చూపులచేత చూచుచుండు రెండునేత్రములును.

మూ॥ పురందరశరాసనేక్షు చాపచాప ద్వయరూపా కృతిభువన మోహనభ్రూయుగళం

యిందద్రచాపమునకును మన్మథుని కోదండముయొక్క ఆకారమునకును. త్రిభువనమోహనంబగు ప్రపంచమును

మోహింపజేయు రెండు కనుబొమ్మలును.

మూ॥ అపరపక్షాష్టమీశశాంకశంకాస్పద,

బహుళాష్టమినాటి చంద్రుడను సంశయాకారముగలిగి

మూ॥ శస్తనిస్తుల కస్తూరీ తిలకసంస్తుతమస్తకం.

శ్రేష్ఠమైన మంగళకరమగు మృగనాభియొక్క నొసటిబొట్టు మిక్కిలిస్తోత్రమునకు పాత్రమగు లలాటస్థలంబును.

మూ॥ ప్రపంచ వాంఛితోదంచితాం = చితఫించా

చంచలలాంఛన

భువనమును గాంక్షింపజేయు సుందరమయిన పూజ్యములగు నెమలి పురులవల్ల కదలుచున్న చిహ్నంబు.

మూ॥ దరదరవిందమ మందనిష్యంద.

కొంచెముగ వికసించిన యర్రతామరనుండిఅధికముగ జారుచున్న

మూ॥ మరందబిందుసందోహ

పూదేనె కణములయొక్క సమూహములను,

మూ॥ కందళితా =

మిక్కిలిపానము చేయుటవలన గలిగిన

మూ॥ నందమదవదిందిందిర నికరభ్రమాకర.

మదముచేత మదించినదగు భృంగముల గుంపులు భ్రాంతిచే తిరుగుచున్న

మూ॥ కుటిలకుంతలపింజ మంజురంజన,

వంకరయగు ముంగురుల సంఘముతోడ మనోహరమైన ఆహ్లాదంబు.

మూ॥ సన్మానసాం = భోరుహాబంభర,

బ్రహ్మజ్ఞానముగల సుజనులయొక్క హృదయ కమలములకు భ్రమరంబు.

మూ॥ సమస్త ప్రశస్తవస్తు సంగ్రహా సంపూరితసాగర,

సకలమైన మంచి సౌందర్యముగల ద్రవ్యములను సంపాదించి నిండింపబడిన సముద్రంబు.

మూ॥ రమాచ క్షుశ్చకోరాం,

ఇందిరాదేవియొక్క నేత్రములను చక్రవాకపక్షులకు.

మూ॥ బరశంబ శేందుబింబ,

ఆకాశమున వెలుంగు నిర్మలమైన చంద్రమండలంబు.

మూ॥ శరదిందు బృందఖండిత, మండితాంశ

శరత్కాలము నాటి చంద్రసమూహాములు కాంతిని తిరస్కృతము చేయుబడిన కిరణములయొక్క అలంకారంబు.

మూ॥ ఖండాంశపండిత మనోపరిదండిత,

తర్కశాస్త్ర విద్వాంసులయొక్క చిత్తములను మిక్కిలి తాడనంబు చేయుబడునదియు.

మూ॥ సకలలోకార్తి నివారక దరహాసచంద్రికా ధావళ్య,

సమస్త భువనములయొక్క దుఃఖమును పోగొట్టబడు వెన్నెలవలె శుభ్రమై ప్రకాసించుచున్న చిరునవ్వుతో యుక్తమైన.

మూ॥ ప్రసన్న ప్రసాద సదానంద సుందర ముఖారవిందం,

నిర్మలమగు ప్రీతిచేత నిరంతర సంతోషముతో నుండు మనోహరమైన ముఖకమలంబు.

మూ॥ సంఫుల్లమల్లికా మాలతీ సుగంధికాది

వికసించిన మొల్లలయు, జాజులయు ఇంచుక యెరుపును తెలుపును గలిగి మిక్కిలి పరిమళము గలదియయు మొదలైన

మూ॥ విమలసుగుదామర మాల్యవృత

నిర్మలములగు పుష్పములయొక్క దండలచేత అల్లాడమగ చుట్టబడినదై

మూ॥ నీలదుకూలాభ విభవాన్విత

నల్లనిపట్టువస్త్రములయొక్క కాంతివలె వృత్సవము వల్ల నొప్పుచున్న నడుమైన

మూ॥ శిరోరుహాభి రమ్యధమ్మిల్లం

తలవెంట్రుకలుగల మనోహరమైన కీలుగంటును

మూ॥ విభాకర శుపాకర పావక ప్రకాశ నిరవకాశ దుర్నిరీక్ష్య

సూర్య చంద్రాగ్నులయొక్క మిక్కిలి ప్రసిద్ధమైన ప్రభలకు ఆస్పదమునివ్వక జూచుటకశక్యంబులగు

మూ॥ వజ్రవైడూర్యేంద్ర నీలగోమేధిక పుష్యరాగ మరకత మాణిక్య ప్రవాళ మౌక్తికాది చటులతర నటన

మరకత, పచ్చలు, మాణిక్య, కెంపులు, పగడములు, ముత్యములు మొదలైన గొప్పతరమగుచు నృత్యమువలె

మూ॥ నటవ్యాశిఖటు

చలించుచున్న కృష్ణములయొక్క సముదాయములచేత

మూ॥ పటుఘటితస్ఫుటితర స్ఫటిత హాటకకోటీరం

దిట్టముగ చెక్కబడిన ప్రకటతరమైన రంగార్చిన బంగారు కిరీటంబు

మూ॥ కమలకైరవ కల్హారవసీ విహార మద మరాళ మదగజ సుదాహహ్రృతి సుగమాగమనం

పద్మములయు కుముదములయు, సౌగంధికములయు, గల జలములయందు సంచరించుచు మదగించున్న హంసలయొక్కయు, గర్వముగల కుంజరములయొక్కయు అహంకారము నణచునట్టి మంచిరాకడగల యానంబును అనగా మెల్లన వచ్చివాడపుట

మూ॥ ఘనాఘన ఘనసమాన దేహధామ

వర్షమేఘముయొక్క కాంతికి సమానమగు శరీరపు కాంతిపల్ల

మూ॥ కందర్పకోటి శతమోహన మద్భుతానంద విగ్రహం

నూరుకోట్ల మన్మథుల సుందరమునకు సమానమయి మైమరచునట్లుచేయు ఆశ్చర్యకరమైన సంతోషముగల దేహంబును

మూ॥ సహస్రకోట్యర్కసంఘాత ప్రతీకాశ తేజోమయం

వేయికోట్ల భాస్కరులయొక్క సమూహమునకు సమానమయిన కాంతి ప్రభావయుక్తంబును

మూ॥ శ్రీదామాది అంఘ్రీరాభర్ణక శ్రీదారతిం

యీశ్రీదాముడు రాధాశాపంబువలన అర్ధాంశము వలన శంఖచూడుడుగాను అర్ధాంశముచేత ఇళాదేవి భ్రాతృవుగా జన్మించి శ్రీకృష్ణునికి చెలికాడైయ్యె తక్కినసుదామ వసుదామ చంద్రభాను సూర్యభాను రత్నభాను గిరిభాను వీరభాను, సుబల దేవప్రస్థ విశాలార్జున సుభాంగ సుందరాదులు దేవాంశజులు చెలువుగలవారు గొల్లలు అట్టిగోపాలురతో కలసి మెలసి విహరించినవాడు ॥ఉ॥ ఎన్నడునైన యోగివిభులెవ్వని పాదపరాగ మింతయున్। గన్నులగానరట్టి హరిగాగిటజేర్చుచు చెట్టబట్టుచున్॥ దన్నుచు గృద్దుచున్ నగుచు తద్దయుపైబడి కూడియాడుచున్। మన్ననసేయువల్లవకుమారులభాగ్యము లింతయొప్పునే॥ (భాగవతము)

మూ॥ రాధావిరజాది

విరజాదేవి రాధకు సమానముగు గోపిక యీమె పుత్రులేడ్వురు ఆమెశాపంబున సప్తసముద్రంబులయ్యె యీమెయే గోలోకమావరించియుండు విరజానది.

శ్రుతినితలంచి నీకదంబములు కృష్ణుని వరంబువలన గోపకులకు గోపసుందరీ తిలకంబులై పుట్టిజారధర్మంబున నందనందనుం బొందిరి. మాధుర్యఖండ ప్రథమాధ్యాయము.

మూ॥ మిథిల

మిథిలాసుదతులు రాముని గాంచి మోహించి తద్వరబలంబున నవనందులను నాభీరులకు వారిజాననలై పుట్టి కాత్యాయనీవ్రతంబున తమకట్టుపుట్టంబులు యశోదపట్టిదొం

గలింప మానభంగంబునొంది కృష్ణునభిమానంబునకు పాత్రు
లైరి. తృతీయాధ్యాయము.

మూ॥ క్రతుసీతా.

కనకసీతలు రామునివరంబుచేత యమునకురంగటి
నుండు గోపకులకు తనూజాతలై రాధికానుగ్రహంబున మాధ
వునింబొందిరి - అష్టమాధ్యాయము

మూ॥ కౌసల

కోసలకాంతా కదంబములు రామానుగ్రహంబున
నవోపనందులకు జనించి యితరగోపకుల పరిణయంబొందియు
జాహ్ణవీధమనంబున కృష్ణుని రతిసుఖంబుల సుఖించుచుండిరి
చతుర్ధాధ్యాయము

మూ॥ మయోధ్య

అయోధ్యావధూ యూధములు దాశరధివరంబందిన
వారలుగాన సింధుదేశాధిపుడైన షట్సహస్రసతులపతియగు
విమలుడను చంపకాపతికి యాజ్ఞవల్క్యమహాముని వాక్యా
నుసారముగ కోట్లకొలదిగా జనించినవారారామామణుల రామా
నుజునికిచ్చి పరిణయంబుజేసెను. పంచ, షష్ఠ, సప్తమాధ్యా
యము.

మూ॥ ఋషి

దండకారణ్యమహర్షులనేకులు రామభద్రుని దర్శిం
చి మోహించుటంజేసి నతసవరంబున తొమ్మిదిలక్షలగోపుల
కధికారియు అయిదువేలవల్లవీజనులకు వల్లభుండును వంగ
దేశనివాసుడన మంగళునకి జన్మించినందు నింటంజేరి యా

వధూమణులు మందరధరుని ధవునిగా బడసిరి. ద్వితీయాధ్యాయము.

మఱియుకృష్ణోపనిషత్.

మూ॥ పులిందినీ

పంచవటీతీరంబున నుండిన శబరయబలస్తోమంబులు రాఘవప్రియమోఘ మోహనాకారంబుగాంచి మించిన మోహంబున నారామభద్రుని చరణరేణుసమాశ్రయణంబున వరంబందినవారలుగాన వింధ్యదరులయందు నెలకొని యనంతరము కంసనియాసీతలై కామగిరి ప్రాంతనివసించుచుండిన కిరాతపత్నులకు పుత్రికలైపుట్టి గోపికాకాంతుని కాంతునిగాబడసిరి. దశమాధ్యాయము

మూ॥ రమోర్ధ్వవైకుంఠ శ్రీలోకాచల

రమావైకుంఠ, ఊర్ధ్వవైకుంఠ, శ్రీలోకాచలములందు ప్రఖ్యాతలగు రమానఖ్యాదులు హరివరంబువడసి షష్ఠ్యప్రభానులకు పుత్రికలై త్రిభంగియన బరగుకపటి యతివేషంబుననున్న నాముురారి చేయు మురళీగానంబునకమందానందంబునొంది నాశంకరప్రియునకు కింకరీతనంబున సుఖకేళిం పరితుష్టలైరి ఏకాదశాధ్యాయము,

మూ॥ భూదివ్య త్రిగుణ

అనేక పుణ్యముమజేసిన భూగోపికలుకొందరు, దివ్యలుకొందరు, త్రిగుణవృత్తులుకొందరు వీరు ఉపనందుల మందిరంబులం బావిర్భవించి రాధికానుచరులై యాదేవితో హేళికోత్సవమందు రాసేశ్వరుని రాసక్రీడలం దేలుచుండిరి,

ద్వాదశాధ్యాయము॥

ము॥ దేవ,

యజ్ఞవరాహమూర్తిం జూచి మోహించి దేవలమహర్షి వాక్యానుసారముగ హిమనగంబున తపంబుగావించుచున్న దేవకాంతలు మాళవదేశమున ననేక సహస్రాభార్యా సహితుడగు నందదివస్పతియగు గోపకునికి కొమార్తెలై యసమాన గానకళా చాతుర్యంబున యాకృపామూర్తికి కృపాపాత్రులయిరి, త్రయోదశాధ్యాయము॥

ము॥ జాలందరీ

రంగపట్టణ వాసస్థుడగు రంగోజియను గోపకుండు కంసునిదయవడసి బహిర్మదపట్టణాధిపతియై యున్న నామహానీయునికి హరివరంబువడసిన జలంధర నారీవారలు ఆత్మజ వైత్రవజ రాజుల బరిణయంబండియు జారధర్మంబున మాధవుని మదన కదనంబునకు వశులైరి. చతుర్దశాధ్యాయము॥

ము॥ నారాయణాగ్నిజో=దద్భో=

మత్స్యమూర్తివరంబున సముద్రకన్యకలును నారాయణ ఋషివరంబున నతని వూరుపులందుద్భవించిన యప్సరసలును అత్రివరంబున భగవత్కళాసంభూతుడగు పృథుచక్రవర్తిచేయు యజ్ఞకుండమున సంజాతలగు యప్సరసలును మున్న వరలబ్ధులగు సుతలసతులును వీరు పంచసహస్ర రమణీమణులకు రమణుండయిన శోణపురాధీశుండగు నందుడను గోపకునికి దహితలైబుట్టి డోలాగీతంబులువాడి రసకేళి

రియు, రాసేశ్వరియు నగు రాధికను మెప్పించి యామెయొక్కల కుప్పచోపట్టిన నొప్పనామె ప్రసాదంబున నానవమన్మథ మన్మథుని మన్మథలీలల నోలలాడుచుండిరి పంచదశాధ్యాయం॥

మూ॥ షష్ఠి

సముద్రమథనంబున ధన్వంతరిజన్మించి యంతహితా తుంబుకాగా లతాసమూహములు తమకధిపతిలేమింజేసి పరమదుఃఖంబున స్త్రీరూపంబులై తపంబున పీతాంబరుని మెప్పించి వరలబ్ధులైనవారగుటంజేసి సమస్తలతలును స్త్రీరూపములుధరించి రసికేశ్వరుని రాసరంగమున రాసక్రీడసల్పిరి. గోలోకఖండ పంచమాధ్యాయము॥

మూ॥ గోలోకా=

“కాశ్చిద్గోలోకవాసిన్యః కాశ్చిచ్ఛయోపకారికాః। శృంగారప్రకరాః కాశ్చిత్కాశ్చిద్ద్వారపాలికాః। పార్షదాభ్యాస్సవ్యజనాః ఛత్రచామర పాణయః। పుష్పాభరణకారిణ్యః శ్రీబృందావనపాలికాః గోవర్ధన నివాసిన్యః కాశ్చిత్కుంజవిధాయికాః। తన్నికుంజనివాసిన్యః నర్తక్యో వాద్యతత్పరాః॥ బృందావనఖండ షోడశాధ్యాయము॥

నారదుండొకపరి స్నానార్థమై మానససరోవరంబునకుబోవ నచ్చో వేడుకలచే జలక్రీడలాడుచున్న అప్సరసలనేకులు మునిచేరవచ్చి మామనంబులు శ్రీకృష్ణుని వరింపవలయునని కోరుచున్నవి సుకోరిక మాకబ్బునేయని విన్నవించిన నారదుండు వారలగని మధుమాసశుక్లద్వాదశియందు అనంతద్వాదశీవ్రతంబుసల్పిన నాలక్ష్మీపిరియునికి పిరియురా

లగుదురనియు నాకుమీారుద్దంపంబున దంశంబు పెట్టరైతిరి గాన అష్టావక్రమునిం బరిహసించి తచ్ఛాపంబున గోపికస్త్రై గోపాలునికి భార్యలగుదురని చెప్పెనుగాన నాయప్సరసలు గోపికలైపుట్టిరి. వరాహపురాణము॥ గ్రంథవిస్తరముచే మూాలము వ్రాయనైతిని

మూ॥ దుర్గత్తమోత్తమ

వీరలు మొదలుగాగల శ్రేష్ఠులైనవారిలో మిగుల ప్రధానులగు

మూ॥ మత్తకాశినిదిత్త

మధుపానముచేయకనే మత్తురాలులవలె నుండువారియొక్క మనంబులు

మూ॥ చిత్తజాయత్తమత్త

మన్మథాధీనములై మదమెత్తిన

మూ॥ దశశతార్బుద

అర్బుదం దశకోటీనాం మునిభిః కథితంవిధా। దశార్బుదం యత్రభవేత్సోపియూథః ప్రకథ్యతే॥ అర్బుదసంఖ్యగలగుంపు యూథమనియు పదియర్బుదసంఖ్యగల గుంపునకు గూడ యూథమని పేరొందును. గర్గభాగవతము॥

దశకోటిభిరేక మర్బుదంబని భాగవత పంచమస్కంధమున శ్రీధర వీరరాఘవీయ వ్యాఖ్య.

మూ॥ ఘోషసుషమ

గొల్లవాండ్ల పల్లెలలోని మిక్కిలిచక్కనివారగు నూరు యూథముల

మూ॥ ఘోషాపరివృత బృందావన ప్రాంగణా=

గోపికలతో గూడికొని బృందారణ్యవీధుల ముంగిలియందు

మూ॥ నంగసంగర

మన్మథక్రీడకై భంగములేని

మూ॥ మభంగాలింగన మంగళ

ఆలింగనము చేయుటవలనకలిగిన శుభ సంతోషములను

మూ॥ తరంగసంగత సాంగోపాంగ

అలలతో గూడుకొని క్రమమైన స్వరములుగల

మూ॥ సంగీతశృంగార రాసరంగ

గానము చేత ఉజ్వలమై మండలాకారముగ అనేకులు అనేకచోటగూడి నృత్యము చేయు స్థలములయందు

మూ॥ భుజంగ రింగమాణ రంగాంగం

విటునివలె సంచారము చేయుచు నటించుచున్న అవయవములు గలవానిని శ్లో॥ అంగనామంగనామంతరే మాధవో మాధవం మాధవం చాంతరేణాంగనాః । యిద్ధమాకల్పితే మండలేమధ్యగ స్సంజగౌ వేణునా దేవకీనందనః॥— మణిమంజరి చతుర్థస్సర్గ మరియు, కృష్ణకర్ణామృతము.

మూ॥ ఇళా రుక్మిణీ జాంబవత్సత్య మిత్రవింద కాళిందీ నాగ్నజిద్భద్ర లక్ష్మణా రోహిణీ ప్రముఖ దశ మహిష్యోత్తర శతాధిక షోడశసహస్ర

ఇళాదేవి ఆదిగోపిక, సాక్షాద్రమాదేవి రుక్మిణి, పార్వత్యంశము జాంబవతి, భూదేవి సత్యభామ, సరస్వతీ గం

గాంశము మిత్రవింద శైబ్య, విరజాంశము కాళిందీ, తులసీ సావిత్రీ స్వాహాంశము నాజ్ఞజితి, (సత్య) హ్రీదేవి భద్ర, దక్షిణాదేవి లక్ష్మణ, రత్నమాల రోహిణి, యీపదునగురుధర్మ పత్నులు. నరకాసురునింటనుండిన పదహారువేల నూర్గురు భోగపత్నులు.

మూ॥ రమణీవిరహమాణ రమమాణ రమణాం

వీరు మొదలైన పదహారువేల నూటపదిభార్యలగు కళలచేత నాథులను రమింపజేయు కాంతారత్నములనెడు కామాభిలాషమును రమ్యక్రీడాదులవల్ల విరమింపజేయుచున్న చక్రాదనము మొదలగువానిచేత జనులనెల్ల సంతోషింపజేయువాడును,

మూ॥ అనంతసహస్రనామాం తగిణతవర తరగురుత

రార్యతనోద్దామనామధే యాన్నమో భగవతే.

అంతములేని సహస్రనామముల యందణగియుండు శ్రేష్ఠతరమునట్టి గొప్పతరములై పూజ్యతచే

ఉత్కృష్టములగు నామములు గలవాడగు భగవచ్ఛబ్దమునకు

శ్లో॥ మాహాత్మ్యస్య సమగ్రస్య ధైర్యస్య యశసశ్శ్రియః।

జ్ఞానవైరాగ్యయోశ్చైవ షణ్ణాంభగఇతీఙ్గనా॥

సంపూర్ణమైన మాహాత్మ్యమును ధైర్యము, కీర్తి, సంపద, జ్ఞానము, వైరాగ్యము అనునివి భగమని చెప్పబడును. అదిగలవాడు గాన భగవంతుడు.

కేశవాయనమః సంకర్షణాయనమః

నారాయణాయనమః
మాధవాయనమః
గోవిందాయనమః
విష్ణవేనమః
మధుసూదనాయనమః
త్రివిక్రమాయనమః
వామనాయనమః
శ్రీధరాయనమః
హృషీకేశాయనమః
పద్మనాభాయనమః
దామోదరాయమనమః

వాసుదేవాయనమః
ప్రద్యుమ్నాయనమః
అనిరుద్ధాయనమః
పురుషోత్తమాయనమః
అధోక్షజాయనమః
నారసింహాయనమః
అచ్యుతాయనమః
జనార్దనాయనమః
ఉపేద్రాయనమః
హరయేనమః
శ్రీకృష్ణాయనమః

స్వయంజాతాయనమః
సోమకప్రమ పథాయనమః
వేదోద్ధృత విధాతనతాయనమః
శార్ద్గదేవోద్దరాయనమః
స్వచ్ఛమహామచ్ఛ్యాయనమః
సురాసురప్రార్థితాయనమః
స్వయంభవాయనమః
మ దరధరాయమః
అచ్ఛబృహత్కచ్ఛపాయనమః
కమలాసన నాసికసంభూతాయనమ
కనకాక్షశిక్షకాయనమః
రసాతలగతధరాధరాయనమః

శ్వేత యజ్ఞవరాహాయనమః

స్తంభసంభవాయనమః

కనద్దంష్ట్రాకరాళ వదనాయనమః

ప్రకాశమానములగు కోరలవల్ల భయంకరమైన వదనముగలవాడు.

పవిప్రతిమాన భాసన్నఖాయనమః

వజ్రాయుధముయొక్క ధారకు సమానమైన వెలుంగుగల గోళ్లుకలవాడు.

రక్షోరాజవక్షోభాగవిభాగాయనమః

జయారంభా నరసింహాయనమః

(వేగము)

కపట = పట్వాయనమః

పాటవవటునటనాయనమః

బలిబంధనాయనమః

త్రిలోకవిక్రమత్రివిక్రమాయనమః

జామదగ్న్యాయనమః

క్షత్రియపుత్రకత్రిసప్తవారాయనమః

కరోరకుఠారాయనమః

పరశురామాయనమః

కారణానేకమవతారాయనమః

వకపరి మహావిష్ణుండు బ్రహ్మసభకేతెంచిన సనకాదులు సన్మానించిరి. విశిష్టుమైన సనత్కుమారుడు ధ్యానస్థుడవలె నుండెను. అదిగాంచి కుపితుడగు

విష్ణువు ఓసత్యవ్రతా నీవు నిష్కాముడవు గర్వముచేత స్తబ్ధముగ నున్నావు గాన శరజన్ముండవై జన్మించి కామాకులుండవు గమ్మని శాపంబిచ్చె అందుకతండు నీకుంను సర్వజ్ఞత్వంబుబోయి కొంతకాల మజ్ఞానివి గమ్మని మరల శాపంబిచ్చె.

ఒకతరి అసురుల వృద్ధికై తపంబుజేయుచున్న భృగు పత్నియు చవనమాతయు నగు పులోమయను సతిని సంహరించినందున అమ్మహామునియైన భృగుండు కోపించి నీకు స్త్రీ వియోగంబు గలుగునని శపించె॥ వాసిష్ఠరామాయణం

జలంధరుండను రాక్షసుని పత్నియగు బృందయను పతివ్రతను జలంధరరూపంబున పతివ్రతా భంగంబుచేయ నామె స్త్రీ వియుక్తుండవు గమ్మని శాపంబిచ్చె॥ వాసిష్ఠ రామాయణం.

నృసింహ్మభటకటమువలన పయోష్ణీనదీతీరంబున నొక మునిపత్ని భయముచే మృతిబొందె. నప్పుడామె భర్తయగు దేవశర్మ దుఃఖితుండై నీకును స్త్రీ వియోగము సంభవించునని నృసింహ్మునిని శపించె వాసిష్ఠరామాయణము,

అంబరీషపుత్రి శ్రీమతి యనుదాని పర్వత నారదులు దామ దామ వివాహముగావలయునని యాచించి వేరువేరుగా వైకుంఠమునకుంబోయి విష్ణుని వేడి సభాస్థలంబున పర్వతుని ముఖంబు వానరాకారంబుగ నుండవలయునని నారదుండును, నారదునిముఖంబు వలీముఖంబుగనుండవలయునని పర్వతుండును వరంబంది స్వయంవరస్థలంబున రాజానుమతముచే నుం

పతరి విష్ణువు నారాయణుడై శ్రీమతిం వైకుంఠమునకు గొంపోయె. నంత ఋషులిద్దరు హరిద్వారంజేరి కపటకృత్యముచే శ్రీమతినపహరించితివి గాన అంబరీషవంశమునందుబుట్టి జనకజయగు యాశ్రీమతిని వివాహంబై యుండెదవు. నీవురాక్షసకృత్యమువలన కన్యకనపహరించితివిగాన నీభార్యయు రాక్షసాపహృత కాగలదు, మేమిప్పుడు యెట్టిదుఃఖమును బొందితిమో అట్టిదుఃఖమనుభవింతువని శాపంబిచ్చిరి. అద్భుతరామాయణ నాల్గవసర్గ॥

బ్రహ్మాదిదేవతాప్రార్థనచే రావణవధార్థమై జన్మించిన దొకకారణము. రామాయణము॥

సూర్యవంశపు అనరణ్యుడను రాజర్షిని రావణుండధర్మయుద్ధంబునజంపిన నారాజు నావంశంబున జనించినవానిచే నీకు మరణంబుసిద్ధించునని శాపంబిచ్చె. రామాయణము ఉత్తరకాండము॥

అనరణ్యునికుమారుడమరబాహుండనురాజు తండ్రిపగదీర్పుటకై నారాయణునారాధించి వరంబువేడిన నీవలన జంపబడదు, నేనీవంశంబునజనించి జంపెదనని నారాయణుండు వరంబిచ్చె. విచిత్రరామాయణము॥

దశరథుడు పుత్రార్థియై పుత్రకామేష్టిచేసిన దొకహేతువును.

మఱియు దశరథుండు సంతానార్థమై వసిష్ఠానుమతంబున • జ్యేష్ఠశుక్లఏకాదశీ వ్రతంబుసల్పిన దొకకారణంబు. వరాహపురాణం॥

కౌసికసవరక్షణాయనమః
పాదరజా — హల్యా పాలితాయనమః
ఖండపరశు కోదండఖండనాయనమః
వైదేహీ వైవాహికాయనమః
పితృవాక్యపాలనాయనమః
చిత్రకూట నివాసాయనమః
సీతాపరాధ విరాధ నిరోధాయనమః
పంచవటీ తటకుటీరాయనమః

మూ॥ శర్వాబర్వ వరగవిత ఖరాది దుర్వార దర్వీకర గర్వపర్వత సుపర్వాధి పాయనమః

శంకరుని అతిశయమగు వరమువల్ల గర్వింపబడిన ఖర దూషణ త్రిశిరులను అడ్డగింపగూడని రాక్షసులయొక్క అహంకారమను పర్వతములకు దేవేంద్రుని బోలినవాడు యాజ్ఞవల్క్యమహాముని పుత్రులగు చంద్రకాంత మహా మేధవిజయులనువారు తమ పదునాలుగు వేల శిష్యగణముల తోడ శంకరు నారాధించి క్రూరరూపంబుగైకొనినప్పుడ రాముని చే ముక్తిబొందుదురని వరంబునొందిన వారలుగాన ఖరదూషణ త్రిశిరులైరి. శిష్యగణంబులు వీరలకు సైన్యంబై యుండి శ్రీరామునిచే మరణంబునొంది కైవల్యంబునొందిరి శేషధర్మము.

విష్ణునా యే హతాస్తేతు ప్రాప్నువంతి హారేగతిం॥ తృతీయస్సర్గ అధ్యాత్మరామాయణ ఉత్తరకాండము.

విష్ణువుచే హతులైనవారు అతనిభావమె పొందుదురు

రావణంప్రతి సనత్కుమారోక్తిః.

కపటహారిణ హననాయనమః
ఖగాధ్యక్ష మోక్షణాయనమః
శబరీఫల భక్షణాయనమః
సమీరకుమార మనుచరాయనమః
సుత్రామపుత్రహంత్రాయనమః
స్వయంపదప్రదస్వయం ప్రభాయనమః
విభీషణార్తి భాషణ శోషణాయనమః
సాయకాత్త సాగరాయనమః
దశశతసహస్రకంఠాది దైత్యకంఠకంఠలుంఠ నాయ నమః
శిశుమరీణ నిహారణాయనమః
సీతాశ్రీరామ చంద్రాయనమః
సంఖ్యాధికానేక బ్రహ్మాండాధిపాయనమః
సమస్త దేవతాహ్వాని తాయనమః
జననీ జనకేతర జనని జనకాయనమః
రాధానవసంగమ సమ్మోదాయనమః
రాధాహృదయ ప్రమోద కాయనమః
రాధారతి సురతాయనమః
రాధామోహన తత్పరాయనమః
రాధావశీకరాయనమః
రాధాలింగన మంగళాయనమః
రాధాకామఫలప్రదాయనమః

పితృదేవతల మానస పుత్రికాత్రితయంబులలో మేనక
ను హిమవంతుని కిచ్చిరి. యీమెగర్భ జనితయగు పార్వతి
మహాదేవునిచేబట్టి రత్నమాలను రాజర్షివర్యుండగు జనకున
కిచ్చిరి, యీమెపుత్రియగు సీతశ్రీరామచంద్రుని వివాహం
బాయెను. కళావతియను నామెను సృన్నగుపుత్రుండైన సుచం
ద్రునికిచ్చిరి. యీవధూవరులు దివ్యవర్ష సహస్రంబులు
తపంబాచరించి చతుర్ముఖునిచే వరంబంది ద్వాపరాంత
మునన్ొకకోటియు యాబదిలక్షల గోకులకధికారియగు వృష
భానుండను గోపకుండయ్యె కళావతియును, యితనికిధర్మ
పత్నియగుటంచేసి యీమెగర్భంబున గోలోకవాసినియగు
రాధాదేవిజన్మించె. కృష్ణునికివస్త్రద్వయంబును రాధకు ఏకా
దశాబ్దకాలంబున బృందారణ్యంబున విధాత పురోహితుండై
విధివిహితంబుగ వివాహంబుగావించె. నాఁటప్రభృతి రాధా
కృష్ణులు రాత్రివేళ రాసమందిరంబులను పగటియందు వృష
భాను నందరాజమందిరంబుల నుండుచుండిరి. గర్గభాగ
వత అష్టమాధ్యాయము. గోలోకఖండ షోడశాధ్యాయము.
మరియు గోపాల సహస్రనామోక్తిః

తారఫలపాద ప్రపదర్శనాయనమః

ముత్తెపుగుత్తులు ఫలింపినయనేకవృక్షములను ...శో
దానందులకుఁ జూపినవాఁడు గిరిరాజఖండ షష్ఠాధ్యాయము,

కరిబుధామభామావర పరిదాయనమః

గోపిసంపూర్ణ కామదాయనమః

గోపికా మానహరణాయనమః

గోపికాంశుకా పహృతాయనమః
గోపస్త్రీక కరపీండితాయనమః
గోపికాస్తన సక్తాక్షాయనమః
గోపికాజనమర్ధనా త్యంతనిర్దయాయనమః
గోపాలాష్టోత్తర కృష్ణసహస్రనామ ప్రసూనాం॥
గోపికాకృత నఖక్షతాయనమః
గోపికా కృత మజ్జనాయనమః
గోపికాచకుంకుమ ముద్రితాయనమః
గోపీచేలాంచలాసీనాయనమః
గోపి సహాభోక్తాయనమః
గోపికార్పిత తాంబూలగ్రహణాయనమః
గోపి దంతదష్టోష్ఠాయనమః
గోపికా భుజోపధానాయనమః
గోపికాశతయూథపాయనమః
గోపికాధ్యానగోచరాయనమః
గోపికావిరహాసంతప్తాయనమః
గోపికాప్రహితా క్రూరనివారితాయనమః
సాందీపనందన ప్రదత్తాయనమః
కంసాద్యసురాంశవంశ హింసనాయనమః

రజక, పూతన, శకట, తృణావర్త, బక, నాగ, ధేనుక, ప్రలంబ, సుదర్శన, శంఖచూడ, వృష, కేసి, వ్యోమ, సామజ, చాణూర, ముష్టిక, హంస, దివిక, సృగాల, మురు, నరక, ఋక్మి, పౌండ్రక, శిశుపాల, దంతవక్త్ర, దస్వర, విదూ

రథ, సాల్వ, పల్లవ, పిప్పల, పంచజనుడు మొదలైన వారిని సంహారించినవాడు.

సహస్రకరకరకర్తనాయనమః

స్థాపితాక్రూరశమంతకాయనమః

ప్రతిదినద్వంద్వధేనుదానాయనమః

నిత్యమును పదుమూడు వేలు నెనుబదినాలుగు కనకధేనువులను యిచ్చుచుండినవాడు, భాగవతదశమస్కంధ,

విదురసదనోదనఖాదనాయనమః

పరీక్షిత్ప్రాణరక్షకాయనమః

సుబోధకోద్ధవాయనమః

రామునివరంబున గుహుండు ఉద్ధవుడై జనించె, విచిత్ర రామాయణము.

రాధాశ్రీకృష్ణాయనమః

మధ్యగయామధ్యమజినసుతాయనమః

దైత్యమానినీ మానహారాయనమః

త్రిపురమారణమార్గణాయనమః

శుద్ధబోధ్యబుద్ధాయనమః

కల్యవసానవిష్ణుయశాత్మజాయనమః

కలియుగాది ౪ లక్షల ౩౨ వేల సంవత్సరములకు విష్ణుయశస్సను విప్రునకు పుత్రునిగా బుట్టినాడు. కల్కిపురాణం॥

ప్రౌఢగాఢప్రతాపాయనమః

పద్మావతీధవాయనమః

యాజ్ఞవల్క్యపురోహితాయనమః

కలిమారకల్కియనమః

శ్లో॥ కల్కి విష్ణుయశఃపుత్రో యాజ్ఞవల్క్య పురోహితం. అని అగ్నిపురాణము॥

చతుర్దళాధార గణేశాయనమః

షడ్దళస్వాధిష్ఠానసురజ్యేష్ఠాయనమః

దశదళమణిపూరకనారాయణాయనమః

ద్వాదశదళమనాహతమహేశ్వరాయనమః

షోడశదళవిశుద్ధ జీవాత్మాయనమః

ద్విదళమాజ్ఞాపరమాత్మాయనమః

సహస్రార గురవేనమః

శ్లో॥ మూలాధారం గుదస్థానం స్వాధిష్ఠానం తు మేహనం నాభిస్తుమణిపూరాఖ్యం హృదయాబ్జమనాహతం। తాలుమూలవిశుద్ధాఖ్య మాజ్ఞాఖ్యం నిటలాంబుజం। సహస్రారం బ్రహ్మరంధ్రమిత్యాగమ విదోవిదుః॥ శ్లో॥ ఆధారస్తు చతుర్దళోరుణరుచి ర్వాసాంత వర్ణాశ్రయ స్స్వాధిష్ఠానమనేక వైద్యుతనిభం బాలాంత షట్పత్రకం। రత్నాభం మణిపూరకం దశదళం డాద్యంఫకారాంతకం పత్రైర్ద్వాదశభి స్స్వనాహతపురీ హైమీ కఠాంతాన్వితా॥ దృష్ట్వారం స్వరషోడశైశ్శశధరం జ్యోతిర్విశుద్ధాంబుజం। హంక్షేత్యక్షర పద్మపత్రియుగళం రమ్యైవమాజ్ఞాపురీ॥ తస్మాదూర్ధ్వమధోముఖం వికసితం పద్మం సహస్రచ్ఛదం। నిత్యానందమయం సదాశివపురీ శక్త్యైనమశ్శోభితం॥ శ్లో॥ షట్శతంగణనాథస్య షట్సహస్రం ప్రజాపతేః। షట్సహస్రం గదాపాణే

షట్సహస్రం పినాకినః । ఆత్మనస్తు సహస్రంతు సహస్రం పరమాత్మన. । గురుమూర్తే స్సహస్రంతు అజపాయాని వేదయత్ ॥ టీ॥ గుదస్థానమందు చతుర్దళకమలమున (వశషస) అను అక్షరములతోడ అరుణకాంతిగల మూలాధార చక్రంబున వినాయకునకు ఆరునూరును, మేఢ్రమందు షడ్దళకమలమున (బ భ మ య ర ల) అను అక్షరములుగల అనేకమెరుపువర్ణముగలిగిన స్వాధిష్ఠానచక్రమునందు బ్రహ్మకు ఆరువేలును, నాభిదేశమందు దశదళకమలమున (డ ఢ ణ త థ ద ధ న ప ఫ) అను అక్షరములవల్ల కెంపులదీప్తిచేతనుండు మణిపూరక చక్రమందు శ్రీమహావిష్ణువునకు ఆరువేలును, హృదయమందు ద్వాదశదళకమలమున (క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ ట ఠ) అను అక్షరములుగలిగి బంగారువన్నెఅయిన అనాహతచక్రమునందు రుద్రునకు ఆరువేలును, భుజసంధియందు షోడశదళకమలమున (అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఎ ఏ ఐ ఒ ఓ ఔ) అను అక్షరములుగల జ్యోతిప్రభయగు విశుద్ధచక్రమునందు జీవాత్మునకు సహస్రమును, నేత్రసంధియందు ద్విదళకమలమున (హంక్షం) అను అక్షరములుగలిగి రత్నచ్ఛవిగాసెరయు ఆజ్ఞాచక్రమందు పరమాత్మునకు సహస్రమును శిరోర్ధ్వభాగమున అధోముఖముగనుండు సహస్రారచక్రమునందు శ్రీగురుస్వామికి సహస్రమును ఈవిధముగ ప్రతిదినము ఇరువదియొక్క వేల ఆరునూరు సార్లు హంసగాయత్రీమంత్రము అర్పణమగుచుండును.

శుకయోగతారావళి,




సర్వలోకపితే్రనమః
సర్వలోక పితామహాయనమః
సర్వలోక ప్రపితామహాయనమః
సర్వలోక కర్త్రేనమః
సర్వలోక భర్త్రేనమః
సర్వలోక హర్త్రేనమః
సర్వలోకోద్భవకరాయ బ్రహ్మణేనమః



శ్లో॥ శ్రీమదానందతీర్థార్య మతాచార ప్రవర్తకః । రాధాకృష్ణస్య భక్తోసౌ కృష్ణమంత్రార్థతత్వవిత్ । పశ్చాత్పినాకినిభాగే మణిముక్తావళీతటే । గ్రామణీగ్రామవాస్తవ్యో (రెడ్డిపల్లి) శిష్టశ్శాండిల్య గోత్రజః । సూత్రేకాత్యాయనస్యైవ అప్రసాఖ్యో మహాసుధీః । తస్యపుత్రో గుణమణిహారనామానితి విశ్రుతః॥

శ్లో॥ శ్రీమద్దుందుభివత్సరే బుధముదేమాసేమధౌ నామకే । శ్రీమద్రాఘవ సత్కృపాతరికటిత్వం ఇష్టార్థసిద్ధిప్రదం। ఐశ్వర్యేశ్వరనామకం సులలితం సూత్రం మయామార్గణో। సాహసృమ్యథ తత్రివింశతికలా కర్త్రావితిఖ్యాతితః॥

౧౦౨౮

శ్రీమదైశ్వర్యేశ్వర నామకగ్రంథం
సమాప్తమగమత్॥
శ్రీకృష్ణార్పణమస్తు.